నెప్పుడుశౌరికంఠమునఁ హేమమయంబగుదండ వేతునా
కెప్పుడుచక్రిభర్తయనిఁ యెల్లరుబల్కఁదురింపుమీఱగన్॥

(అనినకీరవాణిదిగ్గునలేచి.)

కీ—తల్లీభవదుల్లంబురంజిల్ల మునితల్లజుండంతయు కరతలామలకంబుగ చెప్పెచనియెకదా. ఇంతలో తొందరెందుకు. ఎల్లవారాచింతము. (అనునెడ చతురంగబలయుక్తుండై కందర్పుండుదవ్వుదవ్వులదోచిన బెదరి చెలికత్తెలన్గాంచి బిగ్గరగా)

మి—ఉ. మారుడుసారసాలయుకుఁ మారుడుశంబరదైత్యనాథసం
హారుడుమోహకాననవిఁహారుడుపుష్పశరప్రసారణా
చారుడుదుష్ప్రయత్నపరిఁచారుడుయావతమానసాంతకా
కారుడుఘోరవహ్నిగుణపుఁ కారుడువచ్చెనుచూడవేచెలీ. ౮

చ. చిలుకగుఱంబునెక్కికటి♦చెక్కినకేతకిబాకుతళ్తళ
ల్వెలయుపరాకుచెల్పుచును♦వెంటపికంబులుగొల్వగోరువం
కలుభటులై చెలంగసుమ♦కార్ముకమెక్కిడిపూవుటంపర
న్గలికిడుచప్రదేశమొగి♦గాడగనేసెనికేమిసేతునే. ౯

(అనికొంతసేపూరకుండి.)

ఇంతీయీకంతునికొంతసేపుకొనియాడిచూచెద. (అని)

సీ. కమలబాణుండవై♦కమలపాణులనేచ
నాయమాయిదినీకు♦కాయజన్మ
శుకతురంగుండవై♦శుకవాహులగలంచ
మోదమాయిదినీకు♦మాధవసుత
రతినాయకుండవై♦రతికాముకులనొంచ
బింకమాయిదినీకు♦పీనవక్ష
సుమకార్ముకుండవై♦సుమకోమలులముంచ
తేజమాయిదినీకు♦భూజనసుత

గీ. శబ్దసంబంధబాంధవ్య♦సరణిచూడ
భేదమింతైనగనుపించ♦లేదుమనకు

యెందుకో చలమిట్టు చూపు • తెలుపఁగరాదు
భూరితరవిక్రమధురీణ • పుష్పబాణ. 10

(అనియనేకవిధంబుల బ్రార్థించిన నంతకంతకు వెలిపించుచు పంచవిధశరంబు లొడలనించుచున్న కీరవాణిం జేరంజని దైన్యరసంబుతో)

హిందుస్థాని—జాల్ప్వతాళము.

ఇకెంత సేపు నే భరింతును సఖీమణీ।
యకారణంబుగానలంచె నయ్యొ సఖీమణీ॥ యికెం॥
సుమాస్త్రవాళిమేనునిండె చూడవే చెలి।
యమానుషంబు సేయఁబూనె నన్ను యోచెలి॥ యికెం॥
సుమంతయైన ధైర్య మెదను సోక దే చెలి।
సుమంబువంటి మేను కాక నుక్కెనే చెలి॥ యికెం॥
ధరనొప్పు శ్రీ చోళ్లేరునగర ధాముఁడై కృప।
వరలక్ష్మీనారసింహరాయ వరదుఁడేల సే॥ యికెం॥

(ఇట్లుబల్కి తనలో) ఔట్టికి వేయివిధంబులని పెద్దలనెడి మాటలబద్ధమా యీకొంచెపువానిని మంచిమాటలతో వేఁడిన మేలు సేయునా సేయఁడుగాన వీనిమానంబుమాలి నేలపాలగునట్లు గట్టి తిట్టులు తిట్టి యేమట్టు వెట్టెద కానిమ్ము. (అని రోషావేశ ముఖారవిందయై)

మ-శా. నీకోదండము వాడ నీదుశరము • ల్నీరంబులోఁగూడనీ
బాకా చెట్లను జిక్కనారి వెతలై • పద్మంబులందక్కనీ
మూకలొక్కండలనుండ నీరదముపా • ముల్నోటిలో నిండనీ
శోకాశంభుఁడు చూడనేనుమదిలో • సుంతైననిన్వేడఁదా.

ఉ. నీకును నీదుమామకుఁ బెఱనీతి యొకింతయునైనలేక పె 11
న్వ్యాకలపెట్టుచుండెద వకారణవైరముచే వియోగుల
న్దీకొనలేవు యోగులకెదిండిమ గంటిమిగల్గు వాడవే
ఛీ! కమలాస్త్ర శంకరునికే చేడెననమ్మది సిగ్గులేదుగా. 12

(అని సరోరుహాస్త్రుని తిరస్కరించి తదీయ చతురంగంబుల జూచి కోపముతో)

సీ. కీరమా నీకింత • బీరమా హాహాంత
నరువ సాంకవగంధి • నాటవినవె
వాతమా సంజాత • శీతమా ఇదికోత
యనవు సేఫణివేణి • ననుచు కనవె
పైకమా నీవింక • ఢాకమా సవుజింక
మిడనీలవాలనా • మెఱుగవేమొ
భసలమా నీవిట్లు • మెసలమార్గమదెట్లు
హేమనా సనటంచు • నెంచిమనవె.

గీ. యెదిరిబలముల నెఱుగక • నెవ్వరేని
కదసిపోట్లాడ పరిభవం • బొందవకున్నె
యందుకే కద మీదార • హరుని దాకి
భస్మమైపూలదేమున్న • పంతమేది. 16

(అని శుకపికముల యసమీర బంభరంబుల నదలించి చెలికత్తెలజూచి) సఖీమణులారా! యెన్నిజెట్టినా అన్నియు స్మరచి కుసుమాస్త్రుం డసమాన విక్రమంబున పుష్పాటంపరచే నొడలెల్ల, చుఱుకు, చుఱుక్కుమనుపించె. కలకలమని చిలుక లులికిపడ బలికె నాతతభీతినసువాసితంబులు చీకాకుపడ కోకిలమూకలు కోకోయనికూసె. ఇమ్ముగా తలదిమ్ము గ్రమ్ము తమ్మితేనియ లిమ్ముగాగ్రోలి తుమ్మెద మొత్తమ్ములుఝుమ్ఝుమ్మన గానమ్ములు చేసె. మేనువడంకె. నేనింకసైపజాల (నని నెమ్మేనుమఱచి మూర్ఛిల్లిన చెలికత్తెలు వెల్లనైనమోములతో) తల్లి! మాయుల్లంబులెల్ల ఝల్లుఝల్లన మమ్మిక్కడడించి నీవెక్కత్తై వెక్కడికిపోవుచున్నదాన పికజవ్వని మాకెవ్వరుదిక్కు (అనునెడ కీరవాణి ధాతుస్థానంబుల పరిశీలంబుచూచి)

కీ—మదనమాలా.

మ—ఏమమ్మ కీరవాణీ.

కీ—ఇదిగో దీని చేయి చూడుము.

మ—చూచితిని.

కీ—క. ఇదిమూర్ఛగాని వేరొక
విధమేమియు లేదు చూడ • విధుబింబముఖీ,

మ—క. అదియే నేననుకొంటిని
సుదతీ యేమిడిన కనుల • చూచు నెమనలకా. 14

కీ—సుందరీ తొందరించిన కార్యంబవ్వునా నేనందుకేకదా యోచించుటలు.

మ—అక్కా నీవన్నియు దెలిసినదానవు, నీవే చక్కనపోయెదవ్రా నాకు నా చక్కయేముఖ్యము.

కీ. పడతిరో చల్లని • పన్నీరు చిల్కనా?

కీ—యదికను దమ్ముల • కంటవలదు.

మ—కమలాక్షిరో చంద్ర • ఖండంబు రాతునా?

కీ—స్తనచక్రములకడ • దలచవలదు.

మ—కలికిరో చిగురుటా • కుల గుత్తులిడుదునా?

కీ—తనుభర్త్రమునకవి • తగులవలదు.

మ—చెలదిరో నేమంచి • వీవనవేతునా?

కీ—పాణిపృష్టముకడ • పట్టవలదు.

మ—గీ. చారుతరశైత్యచందన • చాటికోరి
తెచ్చితిని చల్లవచ్చునే • మచ్చకంటి

కీ—మదనతాపంబు చేగాగి • హృదయకలశ
పూరితస్నేహరసమది • పారలవలదు. 15

(అనెడు పలుకులకు మదనమాల మదికుదరక)

మ—కం. ఏపని సేయగబోయిన
నాపని వలదందువెప్పు • డదియేమిటికో.

కీ—కం. ఓపడతికోపమటవే
యాపనులాస్థానములను • నహఁములటవే. 16

మ—అక్కా కీరవాణీ! ఈచక్కెరబొమ్మ వాల్చినపక్కకదల్పకున్నది. కాలాతీతంబైన నేమి హాని సంక్రమించునో గాన తొందరగా శైత్యోపచారంబు లొనర్పుటయే మంచిది. (అని కీరవాణిఁజూచి)

సీ. ఇంతియీచిగురాకు లేమి సేయుదమమ్మ?
కీ—రీవిపాదములకంటించవమ్మ.
మ—అరటులపొరలున్నవవియేమిపనికమ్మ?
కీ—పొలతియూరువులకుప్పొదువవమ్మ.
మ—తోరమామిడులగుత్తులెందుకోకొమ్మ?
కీ—చెలిగుబ్బచనులపైఁ జేర్చవమ్మ.
మ—కలువరేకులుచాలఁ జెలులుదెచ్చిరిసుమ్మ?
కీ—కలికికన్నులమీఁదఁ గప్పవమ్మ.
మ—గీ. మొలకజాలమిదెందుకో తెలియుదమ్మ?
కీ—ముగుదకుంతలములనుండి ముడువవమ్మ.
మ—చెలఁగిక్రొందమ్మిలేపనికిఁ జేయనమ్మ?
కీ—నాతిచేదోయికిని గీలుకొల్పవమ్మ. 17

మదనమాలా! చూచితివా యీవస్తువులీస్థలంబులకనుకూలంబులై శైత్యోపచారంబులచే నొక్కయరక్షణంబునకు తెలివి నొంది ప్రకాశింపఁగలదు. చూచుచుండుఁడీ. (అనునంతలో ముసుంగిడిన పట్టుశాలువసడల్చి దిగ్గునలేచి, కీరవాణీ మదనమాలలంజూచి)

మి—తోఁబుట్టువులారా! మీ మోముదమ్ము లెందుకో చిన్నబోయియున్నవి చెప్పుఁడు. (అనినవారలు చెక్కిళ్ళు దువ్వుకొని చెక్కులు ముద్దుపెట్టుకొని గంభీరభాషణంబులతో)

తే—గీ. ఏమిచెప్పుదుమమ్మ నీవిపుడుమూర్ఛ
జెందినందున భయమంది చేయువిధము
లెల్ల చేసిన తెలివొంది తిపుడుమధుర
మృదులవాగ్భృందధృతకుంద మిత్రవింద. 18

(అనిన వచ్చియు రాని నవ్వునవ్వి పునర్మోహావేశం బగుటయు చెలికత్తెలఁ గనుంగొని)

తోడిరాగము—ఆదితాళము.

మి—రాఁడేమాయలకాఁడే-యీఁడుజోడని నమ్మియుంటిని
నన్ను వీడనివాఁడనుకొంటిని। యేడఁ వాఁడయె రాచపాడి మాని
యెందు॥ రాఁడే॥
ఘనుఁడాతఁడవి వలకోటగా। యల్ల। మునిమాటలవినీళ్ళమూటగా।
మది। ననుకున్న ముచ్చటలవి దూరమైపోయె॥ రాఁడే॥
మారుదెక్కువశత్రువుడాయెను। కంటికిరీతికూర్కు లేదాయెను
కీరవాణియింక యేరీతిభరియింతు రా॥
వరకీర్తిజితహీరకాశుఁడై చోట్లె। ధృతిదివ్యసాధనివేశుఁడై
ధరతాఁడేపలిలక్ష్మినరసింహారాయేడ్వుఁడు రా॥

(ఇవ్విధంబున నలంగుచున్న యామంగళాంగింగని తేనెలొలుకుపలుకులతో.)

చె—కం. కోమ్మా నామనవినిగై
కోమ్మా నీవింత మదులుకొనతగదమ్మా
రమ్మా వనరాజివినిక
రమ్మా రయసుగుణసదనరాజితవదనా. 19

చం. అచటికిపోయిచూడదగినట్టివినన్నియుజూపనచ్చట
న్విచికలపుష్పసంపదలవేడుకలెల్లనుగన్న నెమ్మది
న్మెచ్చిగనుపించుపిమ్మటసరోరుహాలోచనయిల్లుజేరిన
న్బ్రచురతనన్ని కార్యములభంగురరీతిజెలంగుతప్పకన్॥ 20

(అనిన సంతోష మొందక డోలాయమానమానసయై)

మి— క. మాటలాకకోటిచెప్పిన
పాటకచేలుండువచ్చిపాసుదలిర్ప
న్నాటముల దేల్చకుండిన
బోటిరోసంతోష మెట్లుపుట్టును చెపుమా. 21

అయ్యా నమీఇష్టానుసారంబువచ్చెదనదియు తీరును. నారదునిమాటలకన్న నీమాటయెక్కువయే! మీకుకోపంబురానేల లెండు. (అని అందరు పరిక్రమింతురు.)

(రంగము. శృంగారవనంబు.)

మిత్రవింద చెలికత్తెలతోఁబ్రవేశించి యచ్చటివింతలు కన్నులకాలఁ
దిఁజూచుచు చెలులంగనుంగొని)

ఫీలురాగము-ఏకతాళము.

వనమెంతో శృంగారమే బాలా।
వినమిట్టిదని గట్టిగను నెవ్వరస్వైరిమున్ను॥ వన॥
అలమల్లెపువ్వుగలతావు-లిలమించెగలిగించె!
వలనొప్పబలుకూరిమెదక॥ వన॥
చామంతివిరులేమొపాలుపొంది-నామీదనామోద।
మీమాడ్కిప్రేమంబుజూపె॥ వన॥
ధరచొల్లేరుపురమునుండి-వరతాడేపలి లక్ష్మి।
నరసింహారాయేడ్యుడేలు॥ వన॥

సీ. తనముక్కురంగుస◆య్యానబూనెననికదా
చిలుకదాడిమపండ్లు◆చించుటెల్ల
తననల్పునీడయం◆దునిచెనేడనికదా
యామ్రంబుననుపికం◆బఱచుటెల్ల
తమకుంభములదాక◆తలచినవనికదా
వెలగపండ్లకుకరు◆ల్వేచుటెల్ల
తనశైత్యమొగిగర్భ◆మునదాల్చెననికదా
వలిగాడుపరటుల◆గలచుటెల్ల.
గీ. తమతనుప్రభలాగితరం◆గములనుంచె
ననిగదా వానిహరియించ◆హంసలెల్ల
నీకొలంకులలోనుండు◆టెల్లచూడ
చిత్రమయ్యెనుపూఁదోట◆చెల్వమెల్ల. 22

(అని కీరవాణి కై దండకొని)

ఆహా మంగళాంగి మనకుఅంగట చెలంగు సరోవరస్థిత మంజాతర కంజాతపుంజ సంజాత, మకరంద, బిందు సందోహపాన మద బంభర డింభ శుంభ త్సంగీత మాధురీ శ్రవణాసక్తచిత్త సమాగతైణ కిశోరంబులును తదైణకిశోర విశాల చంచలదృగంచల సంభూత హాశ్చర్య రసమహార్ణవ తరంగిత రంగిత కరుణాప్లవస్థిత వనదేవతా వితానంబును, తద్వనదేవతా కనత్కనక కుంభసదృశ మాంసల స్తనయుగ్మలావణ్య వీక్షణమాత్ర వ్రీడీకృత కరిణీనికరంబును, తత్కరిణీనికర సముద్యత్కర కంపితరసాల రసారుహంబులును, తద్రసాలరసారుహ పతితమహారుచికరఫలవితానభుజ్యమాన సంతోషిత వనసంచార శబరవనితా సందోహంబై వెలుంగు నీయారామంబు నందనంబును గేలిసేయుటకు సందియంబే సంతోషించితి. (అనిన కీరవాణి సంతోషంబున)

కీ—కం. మెచ్చితిపీవనరాజం
బచ్చుగదోహదముసల్పి వైతివికొమ్మా
మి—కం. మచ్చికతోనదిదెల్పిన
మెచ్చుచునల్పైదనుమనకు మేలుగదమ్మా. 28

(అనిన ప్రతివృక్షంబును జూపించుచు)

కీ—సీ. ఇదియశోకముదీని పదతాడనముసేయు
మిదివకుళంబు మేలొందవనుమియు
మిదికురువకమునీ వెనసికౌగిలిగొను
మిదితిలకంబిందు వదనచూడు
మిదియెమాకందమి య్యెడకరంబునముట్టు
మిదికర్ణికారమిం పెనయఁజేయు
మిదియెవావిల ముఖాహీనవాయువుఁగవ్వు
మిదియె నమేరు మో మెత్తినవ్వు

గీ. మిదియె సంపెంగముఖరాగ-మెలమి నీయ
మిదె ప్రియాళువు సంగీత మిచ్చె బాదు
మీవిధంబునఁ బుష్పించు నీకుజంబు
లట్లుగాకున్నఁ బుష్పించ వదినిజంబు. 24

(అనివలుకు చెలివలుకులకు మిలకనవ్వు లొలుక)

మి—కప్పురగంధి! నీచెప్పినచొప్పున చేసితివి. నీ వన్నమాట లన్నియు వన్నె బెట్టినట్టు జరుగుచున్నయవి నావెంట నంటిరమ్మా. నెచ్చెలీ! యిచ్చట విచ్చలవిడిపూసిన పచ్చపువ్వుల గోరంటదంట కొల్లగా నల్లుకొని తరణి కిరణంబుల జొరనీక చల్లగాడ్పుల కిరవై యుల్లసిల్లు యీమల్లెపొదలలో నుల్లంబులు రంజిల్ల నల్లాపంబులాడుచు కంటికింపైన నీటుకాండ్రతో బోటులు వాటంబుగా కూటంబులొనర్చుట కావా యెంతవీలుగా నున్నదో కన్నులారజూచితివా? యిది యట్లుండనిమ్ము. మనకు అంగటజెలంగు సంపెంగలసొంపు కంటికింపుగాకంటివాఘుమఘుమను వాసనలెల్లదిక్కుల నల్లుకొని బంగరు రంగును తురంగలించగల సోయగంబుచే నివ్వాటిల్లు పుష్పములు కొల్లగా శోభిల్లుచున్నయవి. ఇట్టి పసగల కుసుమంబుల దంట కొక్కతుమ్మెదయైన మతిమఱచియైనం జేరదు కదా. నిండుజవ్వనంబున గండుమీలు నాయండకా పుండరీకాక్షుండరుదెంచని చందం బిందు గన్పించుచున్నయది. అక్కా నాకొక్కరుతో పైరికదా. ఇదిపోనిమ్ము. ఈపన్నీరుకాలువదాటిపోదము రమ్మా. తొయ్యలీ! యీతియ్యమామిడి చెట్టుకొమ్మలసందున పసందుగానుండి మెండుగాపండిన పండులను తనచంచుపుటంబుతో చించి రసవిసరంబు పసమీరఁజూవి తనచెంతనున్న కాంతకందించుచున్న యీశుకరాజంబును చక్కగాజూచితివే! యేమిహాశ్చర్యము! యెక్కడచూచినా స్త్రీపురుషుల కన్యోన్యదాంపత్యంబులే కన్పించుచున్నయవి యిదిచాలించుము. చల్లని నీరంబులు వెల్లువలై పారుచున్న నాసరసిచెంత నొక్కవింతగన్పించుచున్నయది. చె

చ్చెరపోదమురమ్మ. చూడు-చూడు. చేమంతి పూబంతులు రెండుచేతికిచ్చి హెచ్చిన మచ్చికతో నొక్కచెంచుకోడెకాడొక్క చక్కెరబొమ్మనుగట్టిగా బట్టుకొని నీచెక్కుటద్దంబులొక్కసారి నొక్కనిమ్మని మ్రొక్కిన నాటక్కులాడిగిరక్కన మరలిపోవుచున్నయది. అది రతిపరిశ్రమ మెఱుగనికన్నియవలె దోచుచున్నయది. కాకపోయిన యాకలికికంటికింపుగన్పింపకున్న వాడేమో? లేక మననిద్దఱినిచూచినయీముద్దియసిగ్గుచేపోవుచున్నదియో. బోటీ మనకేమైన పాపంబు ప్రాపించునా (అనిన కీరవాణినవ్వుకొనుచు)

కీర — బాలా! నీవెంతబేలవే యీవాలుగంటి నేమైనమన మొద్దనిగద్దరించితిమా యేమి. నీపిచ్చిముచ్చటలిక చాలించుము (అని పశ్చిమదిక్కు మొగంబై)

మి — కలకంఠకంఠీ! మనమనేక మధురరసభరితంబులగు ఫలంబు లనుభవించితిమి. సుధామధురంబైన చల్లనినీరంబులు గ్రోలితిమి. ఈయారామంబునన్గల చిత్రంబులెల్ల కన్నులకింపుగా చూచితి మికకొంత సేపు ఒక్క పొలరసాలభూజంబుక్రింద నెలరాతితిన్నెయందు కూరుచుని పరిశ్రాంతిజెందుదమా తల్లీ. (అందరుపరిక్రమింతురు.)

(రంగము-వనములోనున్న మేడ. సఖీపరివృతయైనమిత్రవింద ప్రవేశించుచున్నది.)

మి — మదనమాలా! కాంచితివా.

గీ.- భానుడలుదెంచునని ప్రేమభామని వేడ్క
పశ్చిమాశాసతీమణి పరగనెఱ్ఱ
పట్టుచీరను దాల్చిన పగిదిచూడ 25
సంజకెంజాయదోచెను ఛాయగలని.

క. ఆచీరపనికిరాదని
దాచివెసన్నల్పులోకదాల్చినగతిమా
డాచానకటికిచీకటు
లీచతురాశల మెలంగె హెచ్చుగపైపై. 26

క. నిక్కముగ గగనచారులు
చక్కగదీపంబులిడిన చందంబున నే
డక్కా చూడవె మింటను
జుక్కలు కన్పట్టి చూడ చూడఁగ నింపై. 27

చంద్రోదయవర్ణన.

సీ. హారికి మ్రొక్కెడి శచీతరుణి వెల్గించిన
దీపించు కర్పూరదీపమే మొ
వ్వా నిజయంతుడొప్పగ భార్య వెసచూడ
మొనసి చూపించెడి ముకురమే మొ
తమ్ముడు చూడ కందర్పుడొయ్యన గట్టి
వంపిన ముత్యాలబంతియే మొ
యమరులు తమజపం బమరఁ దెల్పఁగ వేడ్కఁ
గట్టించినట్టి జేగంటయే మొ
గీ. సారవల్లభకంఠస్థహారమందు
బరగుచున్నట్టి వజ్రాలపతకమే మొ
వైజయంతమునందు దుర్వారగతిని
నలరు గోమేధికపు గడియారమే మొ. 28

(అని కొంతసేపు వితర్కించి గట్టిగా)

సీ. కర్పూరదీపంబుగాదీ వెలుంగుపై
వెలయ జక్కవకవ విప్పఁజొచ్చె
వరపుగా ముత్యాలబంతిగాదీ ప్రభ
పొడగన్న వెన్నెలపులుగు లెచ్చె
ఖచరులమేటి జేగంటగాదీ కాంతి
చూచిన పద్మము లొంపు నిచ్చె
క్రమదర్పణఫలకంబుగాదీ రుచి
గాంచిన కల్వలగములు మెచ్చె.

గీ. సన్నసన్ననివెన్నెలఁ జల్లఁగనమ్మ
చూడచూడగవలిగాడ్పు సోకెనమ్మ
మసుపచుక్కలుపైపైన మాసెనమ్మ
పేర్మిఁగనవమ్మ యిదిచంద్ర బింబమమ్మ. 29

(అనితచ్చంద్రాగమంబున కానందభరితాంతఃకరణయై కొంతసేపూరకుండి)

ఓమదనమాలా! ఓకీరవాణీ! గండుమీరెడి యీపండువెన్నెల జగదండంబు నిండికొని కాంతిమంతంబై యున్నదను సంతోషంబు నామంతనంబున కింతయైన లేదుగదా! మీకందరి కెట్లు లున్నదియో యెండకాలంబున పండునిప్పుల దండఁగూరుచుండ నెట్లుండునో యీ చంద్రుని చంద్రికాహారంబు నామేనికంత యుష్ణంబు చేయుచున్న యది. నాకీబాధసోకకుండ నీకల్వాల వేఁడును వేఁడుకొనుచున్నదాన. (అని ప్రకాశముగా)

క. చల్లనిరేడవు నీదగు
చెల్లెలు కల్కులనొసంగు క్షితినందరికి
న్గొల్లగనీ బావయు పెను
బల్లిదుడు భవద్గురుండు పాల్కడలిగడే. 30

ఇట్టినీవు నాయట్టిపట్టిని రట్టుపెట్టనాయమా (అని వేడుకొని ననంతకంతకు కిరణప్రసారణం బెక్కుడైన తీవ్రకోపానలంబు దరికొల్పుచు,) శీతకరణా! యిక నీగర్వభంగం బగునట్టుగట్టి తిట్టుల తిట్టెద చూడరా (అనిబిగ్గరగా)

సీ. పగలెల్లదాగి దొంగగతిఁ దిరుగాడు
ముచ్చ నీయెదపైన మచ్చవుట్ట
సొంపుగామిత్రుని చూడలేకనలంగు
దైన్యాత్మ నీకళల్ దరగిపోను
చదువుచెప్పినవాని ముదితను చేకొన్న
వావిలేనట్టి నీకన్నాము బట్ట

మొదటిచెల్లెలితాపుఁముదఱింపచేసిన
ఖలనీచపాండురోగంబుపుట్ట
గీ. పుట్టినింటనిబొంగించిపొరలసేయు
కష్టజాతివినీచగిరికాలుచుండ
వెసవిరోగులపై బండఁవేయుచుండ
కందదాయనునీకండకొండురుండ. 31
క. తెరువులబాధింతురయా
పురుషులకై సిగ్గులేకపొల్పుగనీవా
మారదాయుష్మంతులరై
వారివారిపావులకునాయువధికముగాదే.
ఉ. మునుపలదక్షుయాగమునమూఢ్యతదక్షునిపక్షమైమదం 32
బునవడివీరభద్రునితోఁబోరిననిన్నాగివామపాదఘు
ట్టనసలయించెనప్పుడుతఁటాలునబోరితివోరమూఢ్రకాం
గనలగలంచకోరిచెడుగాయిదిబంటుతనంబెరాజసుకా. 33

(అనియనేక విధంబుల దూరిచెలులగనుంగొని) ఇక్కరాతుం
డుకుమిగిలి కట్టినమొండివడి పండువెన్నెలల నలయించుచున్నవాడి
క నేనోర్వజాల. (అని మూర్ఛమునింగిన కీరవాణిమదనమాలంజూచి.)

కీ—క. వనజాస్త్రునిబారికిజ
వ్వనిగుందినగాదెమనము వనముకురాక
ల్వనజాక్షినిచటవటువలె
వనజారినలంచసాగె వనమేలయికన్. 34

(అనిమదనమాలయోచించి)

మ—అక్కా ఈచక్కెరబొమ్మను శైత్యోపచారంబుల స్మూర్ఛదేర్చి
యింటికిచేర్చి యీమచ్చుటలా మచ్చెకంటితల్లికి నన్నలకు దెల్పి
శీఘ్రకాలంబులో స్వయంవరంబు జరుగునట్లు సేయుట యుచిత
మైనట్లు నాకు తోచుచున్నయది. నీచిత్తం బెట్లున్నదో యోచిం

చుము. లేనిచో నీతోయజానన కాయజ తోయజాక్షులబారులచే జిక్కినపిదప మనమేమి సేయఁగలవారము. (అనిన)

శేఖ——మదనమాలా ! నీయోచనయోచించతగినదే.

(అనిమార్చ్బదిర్చి, అందరు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సంపూర్ణము.



# మిత్రవిందాపరిణయనాటకము.

---

## చతుర్ధాంకము

(రంగము-విందుఁడు-అనువిందుఁడు-మంత్రి.)

---



నర్మసచివ! ఇటురమ్ము.

మం—రాజకుమారా! వచ్చియున్నవాఁడ సెలవేమి.

విం—క. మామిత్రవిందకాశ్రిత
కామకువరుసస్వయంవరము సేయుమటం
చామునిపతి సెప్పినమన
మేమియొనర్పకనునుంటిమిందాకనొగిన్.

కావున మంచిముహూర్తంబు విచారించి చెప్పుటకు మనపురోహిత శిఖామణియైన గర్గమహాముని నాహ్వానింపుమా.

మం—చిత్తమాలాగే పిలిపించుచున్నవాఁడ. (అంత గర్గుండరుదెంచి ద్వారపాలకుఁజూచి)

గర్గు—ఒరీ! నీవెవ్వండవురా నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా?

(అనిన వాఁడులోపలికిపోయి)

ద్వా—ఓరి! నీవెవ్వాఁడవురా నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా? (అనినరాజునవ్వుచు)

విం—ఛీ! ఛీ! పిచ్చివిధవా! వచ్చియురానిమాటలు మాట్లాడకుపో. (అంతవాఁడరుదెంచి గర్గునిజూచి.)

ద్వా—ఛీ! ఛీ! పిచ్చివిధవా! వచ్చిరాని మాటలు మాట్లాడకు పో.
అని అన్నాడయ్యా స్వామి!

(అనిన వానిజూచి)

గ—అష్టా గాదురా శంతా! ఆయన వచ్చియున్నాడని అనరా.

[అనిన ద్వారపాలకుడిట్లనగా రాజు కోపోద్దీపితమానసుండై.]

విం—ఛా! దుష్టమానసా! చెంపలు వేయించెద వెళ్ళిపో. మళ్ళావచ్చితి వేని నీమచ్చమాపెద (అనిన వాడువచ్చి అదియేఅనును)

గ—ఈమాటు వెళ్లి మీపురోహితుండగు గర్గుండు వచ్చినాడని చెప్పుమురా (అనినచని వాడట్లుచెప్పును)

విం—శీఘ్రముగారమ్మనుమని చెప్పుమురా (ప్రవేశించును)
విప్రవర్యా పదివేలవందనంబులు కల్యాణు, కల్యాణు. ఈమణిసింహాసనమందధిష్టించుడి (కూర్చుండిపిమ్మట)

గ—రాజన్యశేఖరా! మీరునన్ను రావించిన కారణంబేమో సెలవివ్వుడు (అనినహాసన్ముఖుండై)

విం—గీ. పొందుమీరగ మామిత్రకవిందకిపుడు
పరిణయమొనర్పగను స్వయంవరము సేయ
బూనినారము శుభకరంబైన యొక్క
లగ్నము సుచూచి చెప్పుమీకలలితచరిత. 2

(అనిననా బ్రాహ్మణుండు హాస్యరసంబు చూపించదలంచి)

గ—రాజా మేము క్రొత్తగా గుద్దలించిన పంచాంగశ్రవణ శ్లోకంబు సావధాన చిత్తుడవై వినుము, (అని పంచాంగము చేత పుచ్చుకొని బిగ్గరగా)

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహతం దుస్వప్న దోషాధికం।
గంగాస్నానవిశేష పుణ్యాహనసం గోదానఫలంగం నృణాం।
ఆయుర్భంగమముత్తమం సుచిహతం సంతాన సంపర్ధరం।
నానాకుగ్మతసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం॥

అద్యరాత్రి తిధిప్రమాణత రంగసాని... ......గడబడ నామ సంవత్సర దారితలమాసంబున నింద్రియపక్షంబున నేడు ద్వాదశాంగుళ ...... వారం కంఠాభరణ నక్షత్రం దుర్మదయోగం బాలకరణం. ఈరోజున పన్నెండుగడియలరాత్రికి ... ... ... ... ఛార్జం తెల్లగా వెళ్ళిపోచుంది మహాప్రభో ! (అనిన రాజు ముసిముసి నగవులునగవుచు)

విం—గురుశిఖామణి! మీరిక హాస్యరసంబుమాని శాంతరసంబుగైకొని మేమడిగిన ప్రశ్నకును త్తరంబొసంగవలయును. మహాత్మ! (అనిన సంతోషి తస్వాంతుండై)

గర్గ—అట్లాగే చెప్పు చున్నాను. రాజేంద్ర!

గీ. సరవి రేపటిమాఘమాసంబునందు
శుక్లపక్షంబునసుమడిసొంపుమీర
దశిమిగురువారమునమహాదా త్తగతిని
నెక్కులగ్నంబుసఫలమైయున్నదయ్య, 3

ఈలగ్నంబున మీరాకార్యం బొనర్చితిరేని చక్కగా నిర్వర్తిల్లు. రాజచంద్ర! (అనిన సంతోషించి మంత్రిమొగంబుచూచి.)

విం—నర్మసచివా! యీధరాసురశిఖామణికి అనర్ఘ్యవస్త్రభూషణతాంబూలాదికంబు లిప్పించి వీడ్కొల్పుము. అంగవంగ కళింగ కాశ్మీర కురు కరూశ ద్రవిడాంధ్రదేశ ప్రముఖ చప్పన్నదేశాధినాధులకు ఈవార్త శుభలేఖలమూలముగా తెలియపరుచుము. లగ్నకాలంబు వరకేవిధమయిన లోపములు లేకుండునట్లు అన్ని కార్యంబులొనర్పుము. మన నగరంబుశృంగారింపఁ బనివాండ్రని యమించుము.

మం—భవదాజ్ఞాను సారంబుగా భూసురోత్తమున కన్నివిధంబుల సంతోషపెట్టి పంపినాడ. తక్కినవన్నియు క్రమక్రమంబుగా సిద్ధపరుచుచున్నవాడ.

(అందరునిష్క్రమింతురు.)

రంగము—భర్తృహార్మ్యము.
(మిత్రవింద ససఖియై ప్రవేశించి, చిత్తజాయత్త చిత్తయై తత్తరంబున.)

14 జంఝూటి-రూపకము.

మరచిపోతివిగా కృష్ణా-కృష్ణా కృష్ణా నన్ను
కలువరదీరనీదు సోయగంబుగాంచనైతిహా॥
నెరకౌగిటనుండితివను-బిరుసునవేమోసపోతి మ॥
ఇచ్ఛకములు చేసినా-కేమోయేమో యేమో చెప్పి।
పిచ్చిదానిచేసికూరి-మెచ్చజేసితాహా।
మచ్చికచేవయ్యెదముడి-విచ్చినవలపుచ్చటలు మ॥
పెదవికేనియలాని-యానియానివిచ్చి।
సదమలాంగినిన్ను బాయు-జాలనంటివాహా మ॥
ముదమొదవగకందర్పుని-కదనంబున నేలవదడి।
ధరణిచోళేరుపాల-పాలపాలశౌరి।
కరుణతొదేవపల్లిలక్ష్మీ-నరసింహరాయావన।
శరణంటివిసరసిజముల-నిరసించెడిచరణములకు మ॥

(అను వాక్యంబులు విని వెరగంది కీరవాణి మదనమాలలులేచి)

చెలి—తల్లీ! రాజపుత్రీ! నీకొదవినమదనజ్వరంబును చంద్రశైత్యంబును పోగొట్టి యుంటిమే. తిరిగి కృష్ణపైత్యోద్రేకంబు గలిగినట్లు తోచుచున్నయది. ఏమికారణంబు చెప్పు మొప్పులకుప్పా (అనిన తలయెత్తి చూచి మహాదైన్యంబున)

మి—ఉ. ఏమనిచెప్పుదాన తరళేక్షణలార! మదీయమానసం
బామురవైరియందుప్రియుకమారగడించెను మేనుమాత్రమి
చ్చోమిముబాయకున్నయది-సొంపుగనేనుగమింపగు వెల్లవం
దై మనియున్నదంచునెద-లందులనమ్మకుడమ్మమీరికన్. 4

(ఆత్మగతంబున)

15 నాటకురంజిరాగం-రూపకం

మరచినామరపురావుగా—పగకానివగలు॥
కరువుదీర మోవిపాన-కంబుగ్రోలిచవులకలరి।
చెరుకురసంబాకలెక్కయే—చెలియనిపలికినపలుకులు మఱ॥
నడుముక్రిందయెడమచెయ్యి-నాణెముగనుజొనిపియెత్తి
యొడలెల్లనునొడలిపయిన్యడ-కౌగిలిగొనుదుడుకులు మఱ॥
కప్పురంపువిడెముపంట-గట్టిగానుబట్టినన్ను
చప్పనమునిపంటనుగొను-మిప్పుడనెడుపలుకులన్ని మఱ॥
లలిదలిర్పతాడేపల్లిలక్ష్మి-నారసింహరాయని
నలరించెడుచొక్లేశ్వర-జలజాక్షునిబలునేర్పులు మఱ॥

(అనికీరవాణిమదనమాలగనుంగొని)

సీ. రాడుగానాయీడుఁవాడుగాదయవీడి
నాడుగానాయమేఁచూడవమ్మ

(అనినమదనమాలయంజలిపట్టి)

మ—ఎందుకేచెలివానిఁబొందుకేగదదీని
మందుకేయోచించుఁచుందునమ్మ
మి—పోదుగావిడనాడఁరాదుగాయీరాత్రి
లేదుగాప్రియమునాఁమీదకొమ్మ

(అంతకీరవాణి తేనెలొలుకుపలుకులతో)

కీ—కందకేమదిభీతిఁజెందకేమరుబారి
గుందకేధైర్యంబుఁజెందవమ్మ
మి—గీ. మానవచ్చునెయనుభవఁమైనకతల
మ—మానుటొకయుబ్రమేవెఱ్ఱిఁదానవమ్మ
మి—పోయివచ్చెడివారెవ్వఁరేయచటికి
కీ—పంపవేపోయివచ్చెదఁపైడిబొమ్మ. 5

చికురనిందితషట్పదబృంద! మిత్రవింద! నీడెందంబున నెందుకు సందియంబు. నీయిష్టంబుకష్టంబనకస్పష్టంబుగా చేసెద. చెప్పరగి.

నమాటలు చెప్పిన నిప్పుడే పోయెద. నామాట ముమ్మాటికి నమ్ము.

(అనిన చిఱునవ్వునవ్వుచు కీరవాణింజూచి)

మి—సీ. కనుమూసినను చూచి◆ననుసేదుసోయగం
బున్న తగతితోచుచున్న దనుమి
తనుమానినను కాని◆పనిబూని పెరవాని
కోమలికలనైన◆గోరదనుమి
తనయన్నలనుమన్న◆ననుగోరితనవూన్కి
తెలియగానూచన◆తెలిపెననుమి
సిరిపట్టువరవెట్టి◆నరుచిరబౌణము
ల్వేయగా చెలినిల్వ◆దాయెననుమి

గీ. యలుకలొలుకగకలకల◆బలుకుచున్న
చిలుకపలుకులకలకల◆కులికెననుమి
రమ్మురమ్మనుభసలగా◆నమ్మునకును
కొమ్మకిమ్ముగతలద్రిమ్మ◆గ్రమ్మెననుమి. 6

ఉ. రమ్మనుపుష్పబాణికిక◆రమ్మనురాగముకల్గనీయయి
నైమ్మనుఘర్మణీసలివ◆లె నమ్మనుపందగుమాశుభాంగిని
సొమ్మనుకొమ్మగాదొకరి◆సొమ్మనువేడుకతోడనీవుగై
కొమ్మనుపైడిబొమ్మయను◆కొమ్మనుకృష్ణునితోడనెచ్చెలీ. 7

చ. దరమనుమాశుభాంగికిము◆దంబలరించెడికందరంబునుం
దరమనుమాపసిండికిని◆తళ్కులొసంగెడిమేనితీవికా
వరమనుమాచనుంగవకు◆వారిజలోచన రేపెనాస్వయం
వరమనుమాజనార్దనుని◆వాసిగతోడ్కొనివేగరాసుమా. 8

(అనిచెప్పి నిరుపమాలంకార సర్వావయవయై తనశృంగారం
బంత యొక్కదర్పణపటంబునం దాకర్షింపచేయించి యాదికీరవాణి
కరంబునకు కరంబుగానొసంగి ప్రకాశముగా)

16 శ్రీరాగం-రూపకం.

పోయిరావె బాలికామణీ। హరికడకు నేడు॥ పో॥
నాయుదంతమంత జెప్పి తోయజాక్షుని యెడకును బోయక తే॥ పో॥
నిన్ను నమ్మియున్న దానను। నామనమునందునీ॥ ని॥
కన్నెపాయమెల్లసొగసుగా నొనర్చి। వెన్నునకే జన్నెకడితి॥ పో॥
ఒంటిగాంచిమాటలాడవే। గోపాలుతోడ నెంటి॥
కొంతెలైనయుచటివాలుగంటులకట। వింటేబల్లంటాయిక॥ పో॥
ధారుణిచోల్లేరుపురమున। విహరించుచుండి॥
నారితాడేపల్లి లక్ష్మీనారసింహారాయావనుడేలును నిను॥ పోయి॥

కేశాశితజితనీరద శ్రేణి! కీరవాణి! నాసంగతినీ వెఱింగిన దేకదా! మొట్టమొదట పటంబుముందటబెట్టి కనిపెట్టి మాటలాడుము. స్వయంవరంబునకుదప్పక రమ్మనుము. రానట్టయితే నీరాచపట్టి సిరిపట్టి బెట్టేయునలరంప కట్టియలుగుట్టుచెడగొట్టు. మట్టు మీఱినవగలసెగల న్పొగలి నగుబాటుజెందునని ముకుందునితో చెప్పి యొప్పించుకొనిరమ్ము. వచ్చుచో యావటఫలాధరుని పటంబు దెమ్ము. శుభమ్మగున బొమ్ము (అని రెండుమూడడుగుల కొలంది సాగనంపును.)

(అందరునిష్క్రమింతురు.)

రంగము—ద్వారకాపురంబు శ్రీకృష్ణకోట్టు.

కృ—(కోరమీసంబులు వడవేయుచు) ఆపదుద్ధరోన్నత్య! యుద్ధవామాత్య!

మం—చిత్తము నందితసనక సనందన నందనందన!

17 జంఝూటిరాగం—రూపకం.

కృ—మంత్రిసత్తమా! తెలియంగబల్కు। మంత్రి॥
తంత్రములనుసేయుచుభువి దానవులు జెలంగవారి।
మంత్రంబులువినిశితశర మంత్రంబులజూల్చెదవడి॥ మంత్రి॥

మం—నందనందనా చేసెదనుమనవి। నం॥
ఇందిరేశదనుజుడొక్క-డేని-యుద్ధరాస్థలంబు।
నందునగాన్పించరుయే-సందునడాగిరో తెలియదు॥ నం॥
కృ—భటులువచ్చిరే మనమంపినట్టి॥ భటు॥
దిటవుమీరగానునరుడు-నిటలనేత్రుగూర్చితపము।
పటుగతితోనొనరించియు-పాశుపతాస్త్రముగొనెనట॥ మంత్రి॥
మం—నిజము దేవరా మీఱన్నవార్త॥ నిజ॥
విజయుడుప్రాన్కి దీరకున్న-విస్ఫురత్కృపాఫలంబు
భుజియించిన కరుణించక-పోనే శంకరుడైనను॥ నం॥
కృష్ణ—పౌరులెల్లను సుఖమున్నవారే॥ పౌ॥
పౌరులెవ్వరైన దుష్ట-బాధజెంది యుందురుగద
కారుణ్యమనంబుల మన-వారలు వర్తింతురుగద॥ మంత్రి॥
మం—ధరణిచొల్లేరు పురపాలుడగుచు॥ ధర॥
వడుసతాడేపల్లి లక్ష్మీ-నరసింహరాయాగ్రగణ్యు
సిరులొసగుచు రక్షించెడి-ధరణీజపుని బోలినశ్రీ॥ నంద॥

సీ. పాపిపూతనమున్నె • ప్రాణముల్వడిపోయె
మదతృణావర్తుండు • మాయమాయె
శకటాసురుండు భా • స్వద్రీతినిద్రించె
కడుబావుకొంగర • క్కసుడుగాంచె
కంసభూపతితమ • గమునుండిపడిచచ్చె
చాణూరుడాయమ • స్థలముసొచ్చె
యవనుండు మదమున • దవిలినేలబడగూలె
క్షితిజరాసంధుండు • వెతలదూలె.
గీ. దుష్టసంఘము భవదీయ • ముష్టిహతుల
ద్రెళ్ళిపోయినకతమున • దేవమధ్య
రాష్ట్రజనులెల్లహాయిగా • రాత్రిబగలు
సౌఖ్యములదేలుచున్నారు • చక్రధరణ.

నిర్వక్రపరాక్రమ నిర్జిత దుష్టరాజచక్రుండవై ప్రకాశించుభవద్రక్షణీయంబగుచున్న రాష్ట్రంబెల్లనుల్లసిత సర్వసౌఖ్యలీనంబై యున్నయది. శౌర్యౌదార్యస్థైర్యగాంభీర్య ధుర్యుండవగు నిన్నింతవాడవని స్తోత్రంబు సేయుటకు పాత్రుండనే భక్తపక్షపంకజాక్షా!

(అనిన సంతోషిత స్వాంతుండై కోరమీసంబులు వడపేయుచు)

కృష్ణ—ప్రస్తుతకరణీయంబులగు కార్యంబు లెవ్వియు లేవుగదా.

మం—చిత్తము. విచారించిచూచిన నేమియు కనుపించియుండ లేదు.

కృ—చం. కుడితొడచేయి లోచనముఁగుంతలరీతి చలించుచున్నది
య్యెడనెదలోన వేడుకలుఁహెచ్చఁగజొచ్చెను రుక్మిణిన్మురం
బడరఁగబెండ్లియాడుతఱినైనగతిన్గనుపించెనాకునే
ర్పడవివరించునీమదిఁదిరంబుగయోచనచేసిమిత్రుడా.

మ—సంరక్షిత కృష్ణా! శ్రీకృష్ణా! భవదమృత మధురవాక్యంబులీ సేవకునకు కర్ణానందంబులు చేయుచున్నవి. కొద్దికాలంబులో నొక ముద్దియ నీముద్దరాలగు నట్టుకను పట్టుచున్నయది. ఇందు కెందును సందియము లేదు. దక్షిణనాయకుండవై ప్రకాశించు నీకెందరు సుందరులైనం గొదువగానే యుందురు. దేవా!

(అని అందరు నిష్క్రమింతురు)

రంగము—కృష్ణుండు కీరవాణి.

(కీరవాణి భయభక్తియుక్తిచే తస్కన్యై యొక్క పటంబు హరిముందటన్పెట్టి చేతులుజోడించి)

సీ. జోహారులవెనీకుఁ బాహాబలోద్ధూత
ఘనవిక్రమోద్దీపఁ గంసభూప
దండంబులవెనీకుఁ ధారాధరోపమ
భాసురతరనీలఁ భర్మచేల
జోతలివ్వెనీకుఁ సుందరావహాసిత
కందర్పశతరూపఁ గమ్రచాప

మొక్కులిడ్వేసికు ◆ మునిజనసంతాన
సన్నుతగుణజాల ◆ సత్యశీల
గీ. వందనంబులు సద్భావకఁ వాసుదేవ
శరణులివె హీరకోటీరకఁ శౌర్యసార
నతు లొనర్చెదలకుదుర్మతవిపక్ష
కోటియభివాదనములయ్యెఁ గోనికాయ. 11

కృ—శీఘ్రమేవ భవదిష్టార్థసిద్ధిరస్తు. (అని తదీయలావణ్యంబున కతి జతుకాయత్త చిత్తుండై నవ్వుమొగంబుతో)

మ. సకియా యెవ్వరిదాన వెందుకొరకై చాతుర్య ముప్పారఁ భ
ర్మకలాపద్యుతితోడ వచ్చితివి తోరంబైన నీరూపుమ
చ్చిక చేగాంచిన మోహము న్వెనగొనెన్నెల్లొప్పగా చెప్పు త
ప్పక నాతోడ భయంబు మానియువతీ భాస్వన్మరాళీగతీ. 12

(అనిన శౌరిదయార్ద్రదృష్టికి సంతోషించుచు)

కీ—ఆ. పేరు కీరవాణిఁ సారసమృదుపాణి
పటములోననున్నఁ పడతిమిన్న
సేవసేయుదానఁ జెలగినన్నాచాన
మెచ్చిపంపగానుఁ వచ్చినాను. 13

(అనిసమీపించిపటము చేతపట్టుకొనిచూపించుచు ప్రకాశముగా)

సీ. ఇదికదా కలలోనఁ గదసి తేనెలబావి
యనిచప్పరించినఁ యట్టి పెదవి
ఇదికదా యెదయెదఁ గడియ కౌగిలిఁగొని
సరవితో మెచ్చినఁ చన్నుదోయి
ఇదికదా యెడమచేఁ యిడి మేటిముకురంబు
కరణినున్న దటన్నఁ మరునియిక్క
ఇదికదా తమకంబుఁ గదురగా మేనిపై
వ్రాలిముద్దాడుకఁ పోలపాళి,

గీ. ఇదికదా నీవెముడివిచ్చి కవదలదీసి
చెలిమిత్రోదూల ద్రోసిన కచీఅకొంగు
ఇదికదా నిందుజాబిల్లి కనదరగొట్టె
నంచు మెచ్చినయీ సుందరాంగి మోము. 14

శా. నీమేనత్తకు బుట్టెనోహొ మొదలో నీమీదటన్బెట్టెయో
న్నోమార్గంగజు బారిగిట్టి విధిసోనుండింపు చేపట్టెమో
ఖామానీపతిగట్టియుంచుపటుకన్యాభవంబున నద్దిట్టిమా
రామారత్నము వట్టియున్నదిసుమా ప్రాణంబున శ్వేశ్వరా. 15

(అనిపలుకుపలుకులకు పరమానందంబు జెంది యాపటంబు కరంబునబట్టుకొని తదీయ్యరూప యౌవన విలాసంబులకు మెచ్చి కొనుచు తనలో తాను నవ్వుకొనుచు తలయూచుకొనుచు మీసంబులు దువ్వుకొనుచు కీరవాణింజూచి)

కృ—ఆ. తల్లిదండ్రులెవరు తరుణికి పేరెద్ది
యున్నదమ్మ కెందరతివ యుండు
దేశమెచట దానికేటి తెల్లంబుగ
విన్నవింపుమంత కీవేద్యకాంత. 16

బాలగోపాలా !

కీ—సీ. అధిపనీమేనత్తయైన రాజాదేవి
కూతురై యొప్పునే కువలయాక్షి
విక్రమశాలులో విందానువిందుల
తోబుట్టువయ్యెనే తోయజాస్య
భవదీయమిత్రులై కలుగు పాండవులకు
పినతల్లిబిడ్డయే పీతవస్త్ర
వైభవయుగవంతి వరపట్టణంబున
జన్మించెనే మహోజ్వలకలాప,
గీ. యదియొరదబృందకాంత్యపహాసితకుంద
సఖిజనానందకచరిత సజలకంద

బుధవిహితచ్ఛందవరయాన • వుషితమంద
మేదురార్చితకుందమా • మిత్రవింద. 17

(అనుపలుకులు చెవులకు రసాయనంబులై దోప యూపటంబు దిక్కు చూచి చూచి) కుంతలాకార మధుకరశ్రేణి! కీరవాణి!

కృ—మ. తరుణీనాకబిడాలికిన్దగిన దే • తప్పేమినన్నొకట
ల్గరమర్ధిన్గలలోన దోచినపను • ల్గామింపగాబాడియే
సరవిన్దర్పణపృష్ఠభాగమున భా • స్వద్దీతిగన్పట్టునుం
దరరత్నంబులమూట నందుకొనకాం • తామేరికిన్శక్యమే. 18

(అని పలుకు కృష్ణుని యభిప్రాయం బెఱింగి)

18 శేహాగ్ రాగం-ఆదితాళం.

క్రీ—వినుముదెల్పెదదానికుల్కు పల్కు-పల్కులను-తేనెలొల్కు॥
కనులతళుకు-బెళుకుచేపలనుచు జెప్పనొప్పునా। నీ।
గనినమారుడనగనెంత మనమునాశ్చర్యమొంద॥ వి॥
ముక్కుసంపెంగపువ్వునేలు పెద్దయద్దా
ల్చెక్కులడాలు ముక్కు-టుక్కులాడికురులుతుమ్మెద
రెక్కలనెకసక్కెములాడు-నిక్కుచున్నచనులుపిల్ల
జక్కవలకొక్కరించు॥ విను॥
మోముసోమునితోడబోరు-నారుతీరుచీమలబారు
కామినికంధరముదరము-కోమలియానముసమద
సామజముగానుబల-మేమియులేదునిజముగ॥ విను॥
పరమదుర్మార్గులచెండి-చోళ్లేరనువురమునమండి
ధరణితాడేపల్లిలక్ష్మీ-నరసింహారాయాగ్రణికి
సిరులనిచ్చిబ్రోచుసీతా-వరునిబోలినట్టిశౌరి॥ విను॥

సీ. చంద్రచేలంబు భా • స్వద్దీతినీకుంటె
చంద్రఫాలంబుమా • సతికిలేదె
చక్రంబునీకర • స్థలిప్రకాశించితే
చక్రంబుమాచెలి • స్తనముకాదె

కంజంబున్ననాభి గామోదమొందితే
కంజంబుమాయింతి గళముకాదె
రంభనీకడజేరి రాగంబుపాడితే
రంభమాసఖిమారు రతిచెలగదె
గీ. నీవుగలశబ్దవితతిలో నిక్కముగను
సగముభాగించుకొనియెమా చానమున్నె
రాకనీకేలతప్పమా రామకడకు
బాలగోపాల! రాధికా ప్రాణలోల. 19

ఉ. కంటికినిద్రలేదునిను గంటినిముందొకరేయిపూటనా
యింటికివచ్చిపుష్పశరు డేచఁగనానజనింపజేసిబ
ల్తొంటమెలంగబెట్టితివి ధర్మమెరేపటనాస్వయంవరం
బొంటిగనందరిన్గెలచి యొప్పఁగనన్గొనుమన్నదీశ్వరా. 20

ఉ. అందరికంటెనీవుప్రియు డైనచెలిన్గదయెట్లటన్ననే
బొందుగమేనయత్తకును బుత్రికనైనకతంబునన్గదా
సుందరరూపయోగ్యునిని చూచినముందిగనాడపోకటం
బిందునిభాస్యచెప్పవనఁ జేతుఁణరాగదవయ్యమొక్కెదన్. 21

(అని పలుకుపలుకులకు మొలకనవ్వులొలయ నింతలో కంతుండంత లతాంతకుంతంబులేయ నంతకంతకాకాంతపయి న్మోహంబెక్క గోరమీసంబులు దువ్వుచు)

కృ——కుంతలనిందితబంభరజాలా! బాలా!

ఉ. వచ్చెదనేస్వయంవరమ వారణజూడగనాడుదానినే
మెచ్చెదరాజలోకమున మేయగతిన్నిరసించిదానినే
దెచ్చెదనెవ్వరైనమును దేలియెదిర్చిరయేనిబాణముల్
గ్రుచ్చెదమింటవేలుపులు కోయనియార్వపదేభగామినీ. 22

ఉ. వద్దనుమింక నెమ్మదిని వారిజనేత్రకు చింతతానునా
పద్దనుకష్టముల్జరిగి పాయెనుపాయమికేలనాకుదా

ముద్దునాకు నీవయినిక మోహాము మించెను కూర్మినీవయి
న్నద్దనుపోయిరమ్మి కనుక కంజదళాభ విశాలలోచనీ. 23

ఈపల్కులు నాపల్కులుగా జెప్పి కప్పురగంధికి కంతుసంతాపంబు కొంతయైన శాంతిబఱుపుము. శుభమ్మున బోయిరమ్ము.

(అనితనపటంబో సంగిన)

(అందరు నిష్క్రమింతురు)

చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

పంచమాంకము.

(మిత్రవింద, కీరవాణీ, ప్రముఖులు ప్రవేశింతురు)




ల్లీ మిత్రవిందా! నమస్కరించుచున్నదాన.

మి—నీకు శుభంబగునుగాక. (అని సుందరమగుపటంబు ముందరబెట్టిన పటంబు చక్కగా కనుంగొని ముద్దు పెట్టుకొని)

అక్కా! నీయొక్క భక్తిశ్రద్ధాను రాగప్రియంబులకే నెంతని సంతోషింతునే. నావరోధనంబు దొంగిలించిన దొంగను నెత్తెరంగు నపట్టితెచ్చితివే. నీవంటిదాసీలుండ నేలికసానుల కొక్కకొఱంతయైనసుండునా! దీనికి ప్రత్యుపకారంబే నేమియొసంగెద. రమ్ము. ఒక్కబిగి కౌగిలిచ్చెద. చారువేణీ కీరవాణీ! (అని మోహావేశముఖియై పటంబుచూచుచు)

మి—సీ. ఈతడే మరుబారికెయెరుగనినన్నేరి
మోవిపానకమానుకముద్దులాడు
ఈతడే బిగికౌగిలిమ్మని ననులాగి
చెక్కిలినొరికినకెచెలిమి కాడు
ఈతడే కుచపాళికెనెలమితోడవిరాళి
జేదోయిముట్టినకెచిన్నవాడు
ఈతడే తొడలంటికెయింపుతోడననంటి
కంబంబులనిజానికెగన్నవాడు

గీ. ఈతఁడే నన్ను వలపించి హితవు నించి
మనసు గరఁగించి మెరసిన మాయకాఁడు
ఈతఁడే నన్నుఁ గని చాల యిచ్చ మెచ్చి
హర్ష మొనరించి పోయిన యందకాఁడు. 1

క. ఎప్పుడు వచ్చెద ననుచును
జెప్పెను నీతోడ నాతఁ డెప్పుడు సుమ్మా

కీ—క. ఇప్పుడు శుభ మేనమ్మా
తప్పక వచ్చును గదమ్మ తథ్యము కొమ్మా. 2

మి—సీ. మెచ్చినా ననుమన సిచ్చినా నీతోడ
గలసి మాట్లాడగా కంతుమూర్తి
చూచెనా పటము చేవీచెనా నినుఁగూరు
చుండగా దానవ ఖండనుండు
కప్పెనా కూరిమి చెప్పెనా ముందటి
ముచ్చటలేమైన మునినుతుండు
పట్టెనా వంకంబు కట్టెనా కంకణం
బెలమి వచ్చెదనన్నె నిందుముఖుడు

గీ. ఒంటరిగ నీకు దొరికెనా యింటిలోన
చేడెలెవ్వరు నినుఁ గాచి చూడకుండ
తోచెనా నిక్క మందునా ధుండువల్కు
పల్కులన్నియు విరిబోణి పద్మపాణి. 3

అక్కా! రేపు లేదెల్లుండి యేకదా స్వయంవరంబు ప్రవర్తిల్లు
ట, యిక నమ్మకముగా నొక్కకూక్కపోయెద.

(అని అందరు పరిక్రమించిరి.)

రంగము-అవంతీపురము—గొప్ప అద్దాలమేడ.

(కృష్ణ సాత్యకి దుర్యోధన ప్రభృతి రాజులు ప్రవేశింతురు.)

(అనర్ఘ్య రత్న వస్త్రభూషణ మాల్యానులేపన సంయుక్తఁజేసి
నవీన మోహినీదేవి లీల ప్రకాశించు మిత్రవింద చేతికి నొక్క కాంచనపు

ష్పమాలనిచ్చి మదనమాల కీరవాణులిరువంకలనలంకరించి స్వయంవరంబున కఱుదెంచిన రాజమండలి కనతిదూరంబున నిలిపిన చక్రధరుం డక్కుమారిఙ్జూచి పుష్పశరప్రేరితుండై కోరమీసంబులు వడవేయుచు)

కృ-సీ. ఇదిమింటిపై నుండి♦ యెందుకో తెగివడ్డ
తొలకరిమెరుపులో♦తునకయేమొ
యిదిపూలవిల్తుడిం♦పొదవ భార్యకునయి
కఱగిపోసినపైడి♦కడ్డియేమొ
యిదినలకూబరుం♦డెలమిరంభను మాని
మరలఁగైకొన్న యా♦ప్సరసయేమొ
యిదివసంతుఁడుతన♦యేలికకింపుగా
బంపినచామంతి♦బంతియేమొ
గీ. యిదిజయంతుఁడు ప్రియమెద♦పొదలపెంచి
యల్కవ్రైదమువిడిచినరా♦చిల్కయేమొ
యిదిఖచరులెల్లముదముల♦వెదలిపొదలి
తెరసడల్చినమోహినీ♦దేవియేమొ. 4

(ఇవ్విధంబున నవ్వనజలోచనుం డతీత మోహావేశ సంచలిత సర్వశరీరుండై, యాసుందరాంగి జ్జనాంతికంబుగా కన్నులారఁజూచి)

సీ. వలబడ్డజక్కవ♦ల్వాలెనున్నవిచాన
పైటలోపలనున్న♦పాలయిండ్లు
నిండుచందురులోని♦నెరికప్పుచందమీ
యెలనాగమోముపై♦నెలయుబొట్టు
పెనుతాఁచుపడగవి♦ప్పినరీతిదీని కీ
ల్జెడమీఁదఁగన్పడు♦బెడగుసొమ్ము
మరుఁడువిండులు రెండు♦మఱియెక్కిడినగతి
పొలుచునీలేమ క♦న్బొమలవంక

గీ. తమ్మిపై వ్రాలు తుమ్మెదదండుపగిది
నింతిమొగమున వ్రేలాడుకుంతలములు
రతికరస్థసుహాముకురద్వయంబు
భాతి చెలిచెక్కులందుఁ గన్పడు మెఱుఁగులు. 5

(ఇట్లు తనమనంబున బెనంగొను మోహాతిరేకంబున బొఁగడుచున్న నింతలో నాసుందరి మందమందయానంబున సుందరీమణులకై దండలుగొని రాజలోకంబును గ్రేగంటంజూచుచు తదీయ రూవ యౌవన విలాసంబులం దృణీకరించుచు కీరవాణి మదనమాలల మొగంబుల్గనుంగొని)

మి—చ. ఎవరెవరీమహీశ్వరు లహీనపరాక్రమశాలులై మహో
త్సవమున నీసభారుచిర సౌధమునిండినవార లిప్పుడో
కువలయనేత్రలార! మదకుంజరసద్గతులార! మిమ్మునే
సవినయవృత్తిఁ గోరితిని చక్కఁగఁ దెల్పుఁడి దెల్యనాకొగిన్. 6

(అనిన నాసుందరీమణు లానందంబున)

కి—సీ. ఈనృపశేఖరుండిభపురీశ్వరుఁడైన
దుర్యోధనుండు నిస్తులయశుండు
ఈరాకుమారకుండితనిసోదరుఁడు దు
శ్శాసనుం డూర్జితశాసనుండు
ఈసుకుమారకుండీనృపపుత్రుండు
లక్షణచరితుండు లక్షణుండు
ఈయిన తేజుండహీనవిక్రముఁడైన
కర్ణుండు సద్గుణోదీర్ణకుండు.
గీ. ఇతఁడు మాళవదేశంబు నేలువాఁడు
ఈమహీశుఁడు కోసలభూమివరుఁడు
ఈధరాపతి కాశీశుఁడిభబలుండు
ఇతఁడు సాల్వరసావరుండిందువదన. 7

కీ—సీ. సద్గుణంబులపేటి శతకోటిమన్మథ
సుందరుండితఁడు కృష్ణుండు బాల
హలధరుండీహరి యన్న మహాబలుం
డీమేటిబలరాముఁ డిందువదన
యీశూరుఁ డారుక్మిణీశునితమ్ముండు
సాత్యకియనువాఁడు సామజగతి
కంసునిమిత్రుఁడు త్కటవిక్రమాఢ్యుఁడీ
కృతవర్మయననొప్పు కీరవాణి
గీ. వీరు కేకయరాజులు విబుధహితులు
వీరు సృంజయభూపతుల్ వీరవరులు
వీరు కర్ణాటకేశులు విజయయుతులు
వీరు మత్స్యేశసావరుల్ సారసాక్షి. ౮

(అనివేర్వేర జూపించిన కొమ్మనిమ్మళముగాచూచి తనకంటికిం దంటయైనవాని నొక్కరునైనఁ గానక క్రొత్తచిత్తజునివలెఁ బొలుచుచున్న వెన్నునిఁ జూచుచున్నయెడ కృష్ణుండు పట్టరాని మోహంబున యాడిట్టి రిన్నవయదలచి యాత్మగతంబున)

కృ—ఆహా చక్కెరచవులధిక్కరించగల యీటక్కులాడి కమ్మనివా తెరనొక్కసారియైన జుఱుక్కున నొక్కి యందుసందులేక బారుతేనె లజాలునుగ్రోలి చప్పరించనియుప్పులుగాకి నాలుకనాలుకా! వహవ్వా! మెఱుంగుటద్దంబులం దురంగలించు యీకురంగ లోచని గండస్థలం బులు కొండొకసేవు నిండువేడుకతో ముద్దుపెట్టని గద్దరిదు పెదవు లు పెదవులా! అబ్బురంపు జక్కవగిబ్బలనుబ్బరంబును దెబ్బనబడద్రో యునీబిబ్బోకవతి సిబ్బెంపు గబ్బిగుబ్బల దెబ్బలబడి నిబ్బరించనివాని వక్షము వక్షమా! షహబాస్ తొగలతెగల వగలనగలచేసి ఱిగి నెగడుచందురుని యందంబు పసందుసేయుని యీమందయాన సుం దరాననంబు చెన్నుమీర కన్నులార జూడలేని కోడెకాని లో చనంబులు లోచనంబులా! బళా! రంగారు బంగారుతీగెల సింగార



మెంతని బడాయించు బడాయిగల యీనాతి చేతులు చేతో న్మాదంబుతో చేతితోపట్టుకొని గట్టిగామాటలాడని మేటి కరంబులు కరంబులా! అరే! బెళుకువాలుగల తళుకుల కులుకుగలుగజెలగునీ క్షోపనచాపలంబులకు చూపులను నోపికతో నిలువలేనివాని ధైర్యంబు ధైర్యంబా! అబ్బబ్బా! గోచరంబైన మోహాస్తంభంబుల నీచంబులు చేయు నీకర్ణాంతాయత లోచని యూరువులారని మోహంబున తేరి చూచి మచ్చికచే మెచ్చనివాని మానసంబు మానసంబా! నేనెవ్విధంబున నైన నీజవ్వనికొరకై యీవసుధావరులతో తప్పులాడియైన దక్కించుకొననైతినేని సేనకృష్ణుండనా! పోషితజిష్ణుండనా! (అమనవసరంబున నమ్మగువ నగుమొగంబుతో రెండుమూడడుగులిడినచో దుశ్శాసన పుత్రుండగు లక్ష్మణుండు చూచి మదనపేరితుండై యాత్మగతంబున.)

ల—ఉ. ఇచ్చెదనాకటంచుమును • నింపుదలిర్పగవిందరాజువా
క్రుచ్చెనిదేమిహేతువకొ • కొమ్మకునేడుస్వయంవరమ్ముతా
నిచ్చదలిర్పనేర్పరిచె • నీవిధమెల్లనుచిత్రమయ్యెహా!
యిచ్చపలాక్షినన్నువిడి • యెచ్చటికోజనబూనెమూడగన్. 9

సీ. ఈనారివాతెఱ • పానకంబౌనని
నాల్కగాదదిమోము • పల్కగాని
యీచాన చెక్కులు • యాచించినొక్కని
పండ్లుకావవిరాతి • గుండ్లుగాని
యీచెల్వవయ్యెద • లోచెయ్యిబెట్టని
కరముగాదదిదుఃఖ • కరముగాని
యీసోమముఖిమేని • వాసనల్గాంచని
ముక్కుగాదదికొండ • నక్కగాని
గీ. యెలమితోదీనిసోయగ • మెన్ననట్టి
నోరుగాదదియొకపట్టు • కారుగాని

కోడెతనమునదీనితోఁగూడనట్టి
చెలువుగాదదియొకకొండఁజెలువగాని.

(అని తనమనంబున) నేను నూరకచూచుచున్న నీజోటిదాటి నూటిగా యేనీటుగాని చెట్టబట్టునోగాన దీనిపోనీకపట్టెద. (అని కొంతసేపూరకుండి) ఇందరిలో నీసుందరాంగి నృట్టినేమిపోని బూనునో! పట్టిననాపట్టులో నీదిట్టరినిలుచునో నిలువదో! నిలవకపెనుగులాడినచో చేడెకుచాలడని కోడెకాంద్రేమైన నవ్వుదురేమో అని యుల్లంబెల్ల తల్లడిల్ల కొంతవడికిధైర్యంబు దెచ్చుకొని) కానిమ్ము చూచుకొంద మిక్కడ మావాంద్రందరుండ నడ్డగించువారెవ్వరని దిగ్గున లేచి కరవాలంబు ఝళిపించుచు తోవకడ్డంబై.

19 పురాణభూషణం—ఆదితాళం

పోకుపోకిక్కడనిల్వవెబాలా। చాటి।
పోకడనీకెంతోమేలా॥ పో॥
నీకొరకెయూసించివచ్చియుంటి।నీదు।
పొ కెల్లకన్నులఁగనుగొంటి।నీకు।
నాకనుదీటుగానున్నదంటి।యింత।
లోకిబాకుబీకినన్ను డీకొనెమారుఁడు।దయ।
రాకయున్న-పువుకోలాల।
కాకలపాల్గాకయుందునె॥ పో॥

మి—ముట్టకుముట్టకు దూరముండు।నేను।
గట్టిగనుజూచినను మేనుమండు।నన్ను।
కట్టడిపను లెందుకుదాటిపోర।యింత।
మిట్టిపాటునీకునాయమార।రాచ।
పట్టివైతె యీపనినీకుమేర।యిక।
బెట్టుమట్టుబెట్టుకోక తట్టునతొలగుము।తొలగ।
నట్టయితేనాచిన్నన్నచేబట్టితె నీపాట్టపుడువు॥

ఉ—సుందరి బెదరించితె భయమాగన పనితే,
కుందునె యూరక వచ్చినాన జగ
త్సుందరి యిందుముఖి కౌగిలియ్యవన్న మోద
మొందగ నెందము చెల్వాలమిన్న నీకు
వందనము సేతు సేయుమన్న భేద
మెందుకింత సుందరియాన సుందరుఁడగాన కోర్కె
లెందుకీనవిందనుమాన మెందుకె నాయందు చాన॥ పోకు॥

మ—రాజులు నవ్వేన సిగ్గులేదా ఛీఛీ
నీజన్మము నేలపాలుగాదా యెల్ల రాజ
రాజిత తాజేపలిలక్ష్మీనాథ సింహా
రాయునేలు చొల్లేరుపుర విహార హరి
యైజెలగు జానకీశుని గోర కల్ప
భూజమగు మనన్ను బ్రోవడె జోకదలిర్ప శత్రు
రాజిచూడ నేగోరిన రాజునె నా రాజుజేసి॥ ముట్లు॥

ఓయి భ్రష్టప్రజ్ఞా! ఈస్వయంవరసభారంగంబున కట్టుపదలి నన్ను పట్టవచ్చెద వీరట్టునీ కెట్టుపోను. నీవు రాచపట్టి వయినట్టు దోచక యున్నయది దూరముండుము. నీమానప్రాణంబులు దక్కించుకొనుము. (అని రాజలోకంబు వీక్షించి ప్రకాశముగా) ధరాధర తల్లజాలారా! యీయల్లరి మీయెల్లరి యుల్లంబులకు సమ్మతంబే కదా. (అనునంతలో ననువిందుండు మహారోష భీషణాకారంబుతో వచ్చి వరలోని కరవాలంబు కలుక్కున దూసి చెల్లెలినిఁ బిరిందికిఁద్రోచుకొని వానినెదిరించి భీకరముగా రౌద్రరసముతో.)

శా. ఎట్లాడెదవిప్పటిపల్కుపల్కుమిదె యీరేమౌళిఁ జైగన్వేతునీ
పట్లాద్రిమామదరాస్యబట్టెదువహా వాయీమహారాజుల
న్వ్రట్టన్బెట్టుపుశీర్షభాగమునగర్వంబెక్కెనాకుజ్ఞనీ
కట్టల్లాగవుమానసభాస్థలమునకర్గాకున్న సేపేటికిఁ.

అ. కన్యక స్వేచ్ఛగా నందఱిజూచి తనకంటికెవ్వఁడిష్టమై తోఁచునో వానినివరియించుటయే స్వయంవరము. దానియర్థం బొక్కింతయైన నెఱుంగనినీవొక్క రాజపుత్రుఁడవా! ఛీఛీ! నీమొగంబు చూచుట పాతకంబునకు హేతువు. ఇట్టినిన్ను గెంటించుటయే మేలు. నీవంటి తుచ్ఛభూభుజ కుమారులీ సభలోనున్నను బుద్ధిగలిగి వర్తింతురు గాక. లెమ్ము. (అనెడిమాటలు కర్ణంబుల కశనిఘాతంబులై వోవ దుశ్శాసనుం డాగ్రహోద్వృత్తచిత్తుండై గద్దియపైనుండి దిగ్గనలేచి కరవాలంబు ఝుళిపించుచు)

దు-శా. ఔరాదుర్మతిమత్కుమారకునిసాహంకారతన్దూఱెదా
నీరాజత్వముమాపయిన్నెరపెదే నిర్భాగ్యనీవెంతనీ
బీరంబెంతబలంబదెంతకుమతీ బిట్టుల్కుపుట్టించితిం
కేరితిన్బ్రతుకంగజూచెదవునీకేకీవేళతోమూడెనే. 12

మ. సకలోర్వీతలనాథమస్తకలసద్రాజాంబూనదంచత్కిరీ
టకసద్రత్నమణిప్రభాపటలిచేఁడంబైనపాదంబులీ
య్యకలంకాత్మునిపెద్దతండ్రికిక దాసీయాయోగ్యతల్దూరచే
సికటా! పిల్లనిధిక్కరించెదవెఛీఛీపాపయజ్ఞానసా. 13

ఓరీ! మత్తచిత్త! చతురుదధివలయితభూచక్రస్థిత రాజాధిరాజమకుటమణి ప్రభావిరాజమాన చరణద్వయుండగు దుర్యోధన చక్రవర్తి సోదరపుత్రుండనై వెలంగుచు రంగత్ప్రతాపుండగు నీలక్ష్మణకుమారుండీయంబుజాక్షిని నడ్డగించుటయొక్క లెక్కా! యికమాట ధిక్కరించి మాటాడితివేని నీచెక్కుముక్కు కదుక్కున గోసివేసెద. హీనశౌర్యా (అని మీఁదికురుకును, అంతలో కృష్ణప్రేరితుండై కృతవర్మ పుస్తుమీసంబులుశిస్తుగా దువ్వుచు పలుకయు వాలుంగొని గద్దియపైనుంచి గబుక్కునదూకి దుశ్శాసనునదిసి)

కృత-శా. ఓయీ కౌరవరాజ సోదరమదీయోద్యోగ మీక్షించితే
స్థాయత్త్వైర్యముగల్గెనేని యిదెనాసైరమ్ము కాసేవుచే

చేయుఁ జూచెద నీతనిన్దొకరఁ గాఁచి త్రుంచెద నీవు త్రెక్కుం
డీయొ మామణి బట్టినాయము నగు నేఁ యీయా భూమిభృత్సత్సభన్. 14

బాగు బాగు స్వయంవరసమయ సభామధ్యంబున న్యాయవిచక్షణం బిసుమంతయైన లేక హరిమధ్యం బట్టిన నీపట్టికి తండ్రి దినని చెప్పకొని యుప్పరంబగల నార్చుచున్న నీగొప్పతనంబునకు నేను సిగ్గుపడుచున్నవాఁడ నిక యూరక కూరుచుండను. కేదనినాతో వ్యర్థవాదంబు లేక తారసిల్లుము. (అని నెయ్యపోసిన భగ్గుభగ్గున మండిపడు అగ్నికి తగ్గిన కోపంబుచే కరవాలంబు ఝుళిపించుచు దుశ్శాసనుండు సమరోన్ముఖుండై మహారౌద్రరసంబు చిందులుగొన)

దు—మ. ప్రతివర్షంబున మాకు కప్పములు శుంభద్భక్తి నర్పించు వీ
డతిగర్వంబున మాటలాడవిని యాహా పట్టి పాలార్తునే
కుతలంబందొకఁడైననాకు నెదురై కోల్పోక ప్రాణంబులు
ధృతి జీవించెనె రమ్ము రమ్ము మిక నీ దర్పంబొగిం జూచెదన్. 15

ఓరీ! శుంఠప్రతాప! నీకంఠంబు మత్కరవాలధారచే తీరుతీరుగా తరిగి ఘోరంబగు నీకబంధంబటు నిటు కావుకావుమని వాపోవు కాకగృధ్రంబు లనేకవిధంబుల గొనియాడ విందుపెట్టెద. ఎట్టకేనికిఁ జోక దిట్టవై రమ్ము. క్రొవ్వి యెవ్వరైన వెరుంగక చివ్వకున్నారసి లైదవ! వీండ్లందరుం జూడ నీకండ్లకావరంబు కొంచెములో దించెద. భోజకులపాంస! (అనునంతకు దుర్దాంత కల్పాంత కాకారుండై మేను పెంచి పండ్లుపటపట కొరుకుచు దుశ్శాసనున్ని యనేకవిధంబులకరవాసి విక్షేపణంబు సేయుచు)

ఉ. మత్కృణ మొక్క వ్రేలిపిన సమానిసినల్పివరీతి నిన్ను నే
మత్కటకీతి బట్టినగ వ్రెప్పగ నల్పిద నెవ్వరడ్డమై
మత్కరవాలధారక సమానగతిన్గరమిచ్చువారు ఛీ
సత్కులసూతివై యిటు పాసంగని కూతలు కూయుచెల్లునే. 16

రాజరాజసోదరుండవయి రాజలోకంబు ఛీయన చేయరాని పనులు చేయుచు కూయరానికూతలు కూయుచు కులపాంసుండవయి

పుట్టితివే నీ గట్టితనంబు చూపించుము అని మీదికిలంఘించి శిరోజంబులు పట్టబోవునెడ కర్ణుండడ్డమై కరవాలంబెత్తి సాముసేయుచు)

క—చ॥ నిలునిలు మోరినిన్ను చస॥నిత్తునెమాయయువరాజుపై కిదో
ర్బలముననన్ను డాకిమద॥పారవిజృంభణశక్తి కోర్చిన
న్గలుగుభవత్ప్రతాపము॥గర్వమునంతటిడాకనిన్ను నే
గెలుతునెశూరుడంచునిటు॥బెట్టుమునీముఖమింక దుర్మతీ. 17

(అని గర్వంబులాడుచు దుశ్శాసనలక్ష్మణసహితుండై కృతవర్మ నృట్టి కట్టప్రయత్నించు రాధాపుత్రు దుష్ప్రయత్నంబు గనుంగొని సాత్యకి గదాదండంబు కేలన్గొని గద్దియపైనుండి దిగ్గనురికిహేతివ్రాతంబుతో గల వీతిహోత్రునకు సాటియైన కర్ణునకడ్డంబై)

సా—మ॥ చెడుగానీ మొగమిట్లు త్రిప్పిగనుడా॥సీపుత్రయోకర్ణ! యి
య్యెడనేనున్న దెలుంగ ప్రాకటులక॥య్యెన్నోలు పెన్గ్రిడ్డిబ
ల్వడిమద్బాహువునందుగల్గెడిగద॥న్వీరుండవై తేనిని
ప్పుడొగిన్దాపలచేత బట్టిజనము॥ల్సొల్సొందగాత్రిప్పవే. 18

అరేసూతసూతి! దుర్జనవ్రాత! ఘాతుకుండై జెలంగురంగత్తురంగ పుంగవతురంగునకు సోదరుండనై యవక్రపరాక్రమసంతోషితశక్రుండై విజయుండనిపేరుజెందిన పాండవమధ్యమునకు ప్రియశిష్యుండనై యున్న నన్ను డాకినీశక్తిప్రకాశింపజేయుము. నేనాండిభోజపతిన్బారింతునే! రమ్ము. లేనిచో యుద్ధస్థానంబునందు నిమ్మళమ్ముగా కూర్చుండుము. ఖండితప్రతాప! (అనుమాటలు చెవులకు ములుకులై దోపసాత్యకిముఖుడై)

క—కం॥ గొల్లడపాలును పెరుగును
చల్లమ్ముక బ్రతుకకింత॥సాహసమేలా
బల్లిదులగు రాజన్యుల
నల్లంబగలించి బ్రతికి॥యుందువె చెనటీ. 19

(అనుమాట లశనిఘాతంబులై కర్ణరంధ్రంబులన్బడిన సాత్యకి గదసారించుచు)

20 శమాచి—ఆదితాళము.

సాత్యకి—రారపోరుదమిప్పుడు పారిపోకదుర్మతీ॥ రారపోరు॥
కౌరవేంద్రుడేరికోరి నినువరశూరుఁడనుచు
గౌరవింపబ్రతికెదు॥ రార।
క—పోరునాకొక్కపెండ్లిగా-వీరవరులుడాసిన। పోరు॥
వారివీరివలెనన్నుజూచితో-కౌరసిల్లునీదర్పముఁగనియెద॥ పో॥
సా—ఎంతరనీదుబలము-వివరించిచూడ॥ నెంత॥
వింతగనాగదవ్రేటుననీశిర-మింతింతలుఁగానిప్పుడుచేసెద॥ రా॥
క—ఆడదియైనగానదు-నీమాటలకెదభయ॥ మాడ॥
వాడిగలుగుకరవాలమెత్తితిని-చూడుమిదిగో
నడిమాడునవ్రేసెద పోర॥
సా—గద్దరిమాటలేలర-చూచికొనుమునీయశి గద్దరి॥
గ్రద్దననీపిడిగ్రుద్దునగుద్దినదద్దరిల్లుచునుధరపైగూలవె రార॥
క— ఇలనుచొల్లేరుపురిని-వెలసినసౌధంబున యిలను॥
చెలగుచుతాడేపలిలక్ష్మీనరసింహరాయ
వరదుడైనవెరతునె పోరు॥
(అనియిట్లిద్దరన్యోన్యజయకాంక్షులన్యోరాడుటకై నిశితకాక్షే
యవిక్షేపణరీతులు సేయుచుందురు)

(వ్యాసమహాఋషి ప్రవేశము)

వ్యా—ఓహోహో! యాదవకౌరవవీరులారా! యికమీమీ తెగువలు
చాలించుడు. నామాటలువిని శాంతింపుడు (అనువాక్యంబు
లందరి కర్ణరంధ్రంబులన్పడి తమతమకైదువులువదలి యమ్మ
హానుభావునకు మ్రొక్కుదురు (అంతవ్యాసుండుకృష్ణునిగని)
త్రిజగద్రక్షా! దుష్టజనశిక్షా! పుండరీకాక్షా! కృష్ణా! పోషితకృ
ష్ణా! నీవుండియేనా వీరినీపనుల చేయించుట? భవన్మాయాంధ
కారకూపంబున నబడివెడలు మార్గంబు శంకరపంకజాసనుల
కుందరంబె మహానుభావా! రక్షింపుము రక్షింపుము.

(అనిరాజలోకంబు నిరీక్షించి)

ఉ. ఏతపనీయచేలుడు మహేశ్వరసన్నుతుడే యదూత్తముం
డేతరణిప్రభామకుటుఁడే నవనీరదచారువిగ్రహుం
డేతులసీవిభూషణుఁడు యే సుమసాయకకోటిసుందరుం
డాతఁడె శేషుఁడుండు వరుఁడై తగునీమకురాస్యకప్పుడున్. 20

కానమీరందరానందనందమున కీసుందరిసుందరియై పెంపొం దుటకు డెందంబుల నానందింపుడు ఇదిబృందారక సందోహంబున కును శంకరవాణీవశంకరులకును హితవై యున్న దిందు కెంతయుసంది యంబులేదు. (అనువెడమిత్రవింద వధూటికామణి డాసి వ్యాసునకు మ్రొక్కును, ఆసుందరి యందంబుచూచి పారాశరపుత్రుండు నవ్వు కొనుచు)

వ్యా-ఉ. జవ్వనినీదుపాయముకుఁ జక్రధనంబుకునీదురీవికిన్
నవ్వుమొగంబుకున్వృషిఁ నాగరికంబుకు మెచ్చినాడనీ
కెవ్వనియందుకోర్కెజనిఁయించెనో నిర్భయ మొప్ప నేగిసీ
వవ్వరశౌర్యకంఠమునఁ హాయిగ నేయుము పుష్పమాలికన్. 21

(అనిన సంతోషిత స్వాంతయై చేతులుజోడించి)

మి-సీ. ఎవ్వాడమఱ్రాకొత్తఁ బువ్వీలుకాడునా
గొల్లపిల్లలవయఁ బెల్లగొనియె
నెవ్వాడువరశౌర్యఁ మెనయుగానామేన
మామకుపట్టియై మలయుచుండె
నెవ్వాడుసోయగంబెంపారజనుదెంచి
కలలోననన్మోహకలితఁ జేసె
నెవ్వాడుబలిమిచేనెల్లదుష్టులజంపి
దృఢశక్తితోడసత్కీర్తిగాంచె
గీ. నట్టికౌస్తుభమణిహారుఁ నవసుధీరు
జిష్ణుసన్నుతునుగుణరోఁ చిష్ణుకృష్ణు

కోరియున్న దినాంమదికిగుణవిధాన
దయగనుంగొనుమిక పోయికిదండవేతు. 22

(అని నమస్కరించి నిలచియున్న చేడెన్గాంచి)

వ్యా. శీఘ్రమేవ మనోవాంఛాఫలసిద్ధిరస్తు. సుందరీ! యాలస్యం బెందుకు నీయిష్టమ్ము కానిమ్ము. (అనిన చెలులిరుగడలనడవ మందమందయానంబుల నరిగి కరంబున నున్నట్టి కాంచనమాలిక హరికంఠంబున వేసి తలవంచుకొని నిలచియుండును.)

(అందరు నిష్క్రమింతురు)

రంగము—వివాహమంటపము.

(గర్గమహాముని విందానవిందులు కృష్ణసాత్యకి బలరామ కృతవర్మలు మిత్రవిందా మదనమాల కీరవాణులు విధ్యుక్తప్రకారంబున కల్యాణంబొనర్చి సోదరీమణియైన మిత్రవిందను కృష్ణునకొసంగి విందానవిందులు చేతులుజోడించి)

విం—సీ. నిరుపమవిస్ఫురత్సరసిజాయతనేత్ర
భైష్మీకళత్రశుంభచ్చరిత్ర
పృథుసురభీయుతబృందాటవీలోల
పాలితామరజాలనీలనీల
ఘనరుచిజితమూర్త్యకౌస్తుభాంచితహార
నవనీతచోరదానవవిదార
సుందరతిలకసంశోభితసులలాట
మానితఖగఘోటమణికిరీట
గీ. రత్నకుండలయుత కర్ణరమ్యవర్ణ
సూరి సందోహమందారశతారహార
విజయవందిత గోవిందవిశ్వతుంద
కేశవాచ్యుత సత్కీర్తికృష్ణమూర్తి. 23

చ. పొలుపుగ మేనమామకునుపుత్రుడ నేనిటు లుండమానిమీ
చెలియలికి స్వయంవరముసేయుటతప్పని యెంచబోకుడా

ఖలుడు సుయోధనుండు మముఁగారియబెట్టు నటంచుయార్తిఁ బెం
పలరఁగ జేసినారము సుకేధాధరమిమ్ము వరించునంచొగిన్. 24

(అని జాంబూనదాంబరాభరణ గజతురగస్యందన భటనటవిటగాయక పరిహాసక దాస దాసీలనరణంబొసంగి సాగనంపిన అందరు నిష్క్రమింతురు)

మంగళహారతి. రాగం. నాదనామక్రియ-ఆదితాళము.

మంగళమిహాశౌరి|లోక|మంగళదాయక మంగళవిగ్రహా॥ మంగ॥
రంగాపతంగతురంగపోషితకు-రంగా సదృశఫాల|
మద|భృంగాచికురజాలా|బుధ|సంగక్షేమచేలా,
రణరంగరిపువిఫాల| యంగజాంగభంగలోల॥ మంగ॥
రామానిర్జితభృగురామా|శ్రీకృష్ణబలరామా రాధికాజార|
పరభీమా కంసవిదారా|రవి|ధామాకౌస్తుభహారా|
గోపి|కాముఖపద్మసూర| కామకామశ్యామాకార॥ మంగ॥
నందగోపాలకనందన సనకాసనందన హృదయతోష|
పరి|మ్రందితభక్తదోష|జన| వందితచారుభూష|
కవి|మందారనరకశోషా, మందమందసుందరభాషా॥ మంగ॥
నరతాడెపలిలక్ష్మీ నరసింహారాయేడ్య నరసఖమందహాస|
చోళ్లేరు|పురభవ్యహర్మ్యవాసా|జానకి|వరనిత్యసత్యోల్లాస|
చాంపేయ|వరపుష్పదివ్యనాసా|మురహరశరనిధిత్రాసా॥ మంగ॥

మంగళహారతి. సురటరాగము-ఆదితాళము.

హారతులివ్వగరారెలక్ష్మీ నారాయణహరికి|
సమాశ్రయ|వారణరిపుహరికి॥
మహాభయ| కారణభవతరికి|
శిరోరుహ|వారవినీలవిదారితబంభర|
నారులార సుకుమారులార|శుభ॥ హార॥
తొగలమగనిజిగి దెగడెడునగు మొగముగలుగు ద్వారసుండి|
తనంతట| నెగడునెపుడుధండి|

శివాంశుల| మిగిలెరిపుల చెండి| మహాత్ముఁడు|
ఖగనాయకతుర-గగమనుఁడురుప|
న్నగఫణశయనుం-డగకరిసకుబలు॥ హార॥
శరదాంతర్గతచంచలవలెసిరి| యురమునగలవాఁడు|
చెల్వున|మకుటిమిణితెనాడు| పీతాం|బరముఁదాల్చినాడు
చూడుడు|తరళేందీవర-దళలోచనములు|
తరుణులారకుం-దరదనలార॥ హార॥
పాంటపుగచాల్లెద్సురమున తాడే|వలిసత్కులమణియై|
మహాబుధ| ఫలదసమ్రగణియై|సదామది|
ఖలనిరసనగుణియై|ముదంబున|జెలగుబత్క్మినరసింహరా-
ట్సదనలయుఁడైన హాకినీలునకిప్పుడు॥ హార॥

క. సాధారణవత్సరమున
పాదుగనాశ్వయుజశుద్ధశివరవిదియను సం
మోదమున మిత్రవింద సు
ధాధరినాటకము పూర్తిరయ్యెహరికృపగా. 25

ఫలశ్రుతి.

క. ఈనాటక మెవ్వరైనను
మానుగఁజదివినసువిన్నకమతిఁవ్రాసినచో
మానితగతి చాల్లేరువు
రినాధుఁడు ప్రోచుచుండుసుకృపరంజిల్లన్. 26

గద్యము.

ఇది శ్రీ మాచెర్ల చెన్నకేశవా క్షీణ కటాక్ష వీక్షణ ప్రవర్థిత చతుర్విధ
కవితావిచిత్ర కాత్యాయనసూత్ర హరితసగోత్ర సూరపరాజగోత్ర
రోహిణీకళత్ర సీతారామమంత్రిపుత్ర సుకవిమిత్ర వేంకట
రమణ కవికందపత్ర ప్రణీతంబైన మిత్రవిందాపరి
ణయనాటకంబు సర్వంబు పంచమాంకంబు
సంపూర్ణము.

